నదియందు మత్స్యము (మీనము) అటునుండి ఇటకు, ఇటనుండి అటకు సర్వదా సంచరించు విధముగా జీవాత్మయను మత్స్యము ఈ సంసారాంబోనిధియందు ఐహికాముష్మిక విషయములకు అటునిటు నిలకడ లేకుండగా చలించుచున్నది.

శ్లో॥ పృష్ఠిదేశే సమాకాన్తః కుర్మోనామాభిధీయతే ।
ఊర్ధ్వ మధ్యం వామభుజః కక్షయా మాశ్రయేత్కరమ్ ॥

19. కూర్మం : ఎడమ హస్తముతో అధోముఖమై యుండవలెను, అట్లే కుడిహస్తముకూడ యెడమదానిపై నుండవలెను.

సర్వేంద్రియముల మరలించుటకుగాను (కూర్మము అవయవములలో పల్క సుఖముగా ముడుచుకొను విధముగా కూర్మవృత్తిని గల్గింపుము.

శ్లో॥ వరాహో నామ ముద్రేయం కధితా మునిసత్తమైః ।
కంఠాశ్రితా కరౌ కర్ణ - సంశ్రితా పాయుతాంగుళీ ॥

20. వరాహకం : ఎడమ భుజముయొక్క మధ్యగము మీది కుండవలెను. రెండు హస్తములు కుడిచంకను తాకుచుండవలెను.

నా హృదయారణ్యమున మదమాత్సర్య మోహాదులడవి వరాహము లనేకములు తిరుగుచున్నవి, వాటిని వేటాడి చంపుము.

శ్లో॥ సింహాక్రాన్తసంనామ ముద్రా కాన్తమిత్యపింధ్యతే ।
కించిదాకుంచి తాగ్రౌచ హస్తౌకృత్వా తధా భవేత్ ॥

21. సింహాక్రాంతం : వ్రేళ్ళను యధాతథమునే యుంచి రెండు హస్తములను రెండు చెవులకు తగులుచున్నట్లు చేర్చిన సింహాక్రాన్త మగును.

మనస్సును సింహము తిరుగుచున్నయది అట్టితరి మోక్ష పేక్షుండనగు నేను నా వనసీమలకు బోకుండ నుండవలె గాన బోకుండ నటుల చేయును.

22. మహాక్రాన్తం : పై రీతిని చేతులను వ్రేళ్ళ కొనలను మాత్రము కొంచెము వంచిన మహాక్రాంతమగును.

కర్మవాసనలను అనేకంబులగు సమిధలచే మంటలురేగి దహింపబడుచుంటిని.

శ్లో॥ ఊర్ధ్వం కించి దతౌ పాణి ముద్గరో వామ తర్జనీ ।
గ్రస్తాదక్షిణహస్తేనముద్రాః ప్రోక్తా మనీషిభిః ॥

23. ముద్గరం :_ హస్తముల రెండింటిని కొంచెము మీదుగా నెత్తియుంచి, యెడమచేతి చూపుడువ్రేలును కుడిచేతితో పట్టియుంచిన ముద్గరమగును.

సంసార బంధవిముక్తి కొరకగుచున్న ధృఢతర వివేక వైరాగ్యంబను ముద్గర వృత్తిని నిల్పుము.

శ్లో॥ అధోముఖః స్థితో మూర్ధ్ని వల్లభో దక్షిణః కరః ।
ముద్రాణాం లక్షణం ప్రోక్తం వసిష్ఠాద్యైర్మునీశ్వరైః ॥

24. పల్లవం : ఈ ముద్రను పదిమందిలో ప్రదర్శింపరాదు. ఇట్లు ప్రదర్శించిన దేవతలు వానిని చూడరు. అతడు గావించిన కృత్యమంతయు నిష్ఫలమగును.

## జపము

ఓం భూర్భువస్సువః ఓమ్ తత్సవితుర్ వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్. (౧౦౮-కు) తక్కువలేక జపము చేయవలయును (ముద్రలు) -సురభిర్ జ్ఞానచక్రేచ యోనిః కూర్మోఽథ పంకజమ్। లింగం నిర్యాణ ముద్రా చేత్యష్టముద్రాః ప్రకీర్తితా॥

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.

(పునః కరన్యాసం అంగన్యాసం చేసి) దిగ్విమోకః (అని చెప్పవలయును.)

## దిగ్దేవతా నమస్కారము

ఓం నమః ప్రాచ్యైదిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః (పూర్వదిక్కును చూపవలయును) నమో దక్షిణాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి. వసంత్యేతాభ్యశ్చ నమః (దక్షిణదిక్కును చూపవలయును.)

నమః ప్రతీచ్యైదిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంత్యే తాభ్యశ్య నమః (పశ్చిమదిక్కును చూపవలయును)

నమః ఉదీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః (ఉత్తరదిక్కును చూపవలయును) నమః ఊర్ధ్వాయై దిశేయాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యే తాభ్యశ్చ నమః (అంతరిక్షమును చూపవలయును)

నమోఽధరాయై దిశేయాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః (భూమిని చూపవలయును)

సమోపాంతరాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతి వసంత్యేతాభ్యశ్చ నమః (క్రింద చేతులుతిప్పి చూపవలయును.)

## అభివందనము

నమో గంగాయమున యోర్మధ్యే యే వసన్తి తేమే ప్రసన్నాత్మాన శ్చిరంజీవితం వర్ధయన్తి నమో గంగాయమున యోర్మునిభ్యశ్చనమః, సంధ్యాయైనమః, సావిత్ర్యైనమః, గాయత్ర్యైనమః సరస్వత్యై నమః, సర్వాభ్యో దేవతాభ్యో నమః, దేవేభ్యోనమః ఋషిభ్యోనమః మునిభ్యోనమః గురుభ్యో నమః పితృభ్యోనమః, మాతృభ్యోనమః కామోకార్షీ న్మన్యుర కార్షీన్నమో నమః, పృథివ్యాప స్తేజో వాయురాకాశాత్, ఓం నమోభగవతే వాసుదేవాయ, యాగ్ంసదా సర్వభూతాని చరాణి స్థావరాణిచ సాయం ప్రాతర్న్న మస్యన్తి సా మా సంధ్యాభిరక్షతు, (అని చేతులు జోడించి ప్రార్థన చేయవలయును.)

చతుస్సాగరపర్యన్తం గోబ్రాహ్మణేభ్యః శుభంభవతు, శర్మ వర్మగుప్త .... గోత్రః యజుశ్శాఖాధ్యాయీ అంహభో అభివాదయే, అని రెండు చేతులు చెవులదగ్గర వుంచుకొని చెప్ప వలయును.)

కేశవ నామాలతో ఆచమనముచేసి ముగించవలెను.

కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాఽఽత్మ నావా ప్రకృతే స్స్వభావాత్। కరోమియద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి ॥ (చేతిలో నీళ్ళు పట్టుకొని

ఈ మంత్రము చెప్పి నీళ్ళు విడువవలయును) ఏతత్ఫలం శ్రీమన్నారాయణార్పణమస్తు శ్రీపరమేశ్వరార్పణమస్తు ఓమ్ తత్సత్ బ్రహ్మార్పణమస్తు.

ఆచమ్య

యస్యస్మృత్యాచ నమోక్త్యా తప స్సంధ్యాక్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందేతమచ్యుతం ।
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన । యత్కృతం
తు మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

అనేన ప్రాతః (మాధ్యాన్హిక) సాయం సంధ్యావందననేన భగవాన్ సర్వాత్మకః తత్సర్వం శ్రీవాసుదేవః ప్రీణాతు.

మధ్యే మంత్ర తంత్ర స్వర వర్ణ లోప దోష ప్రాయశ్చిత్తార్థం విష్ణోర్నామత్రయ మంత్రజపం కరిష్యే ॥

కేశవాయనమః నారాయణాయనమః మాధవాయనమః కేశవనారాయణ మాధవకేశవనారాయణ మాధవేభ్యోనమః ॥

ఓం తత్స ద్భ్రహ్మార్పణమస్తు

# సంధ్యాకాల వివరణ

గౌతమ :

శ్లో॥ ఉత్తమా తారకోపేతా । మధ్యమా లుప్తతారకా ।
అధమా సూర్యసహితా । ప్రాతఃసన్ధ్యా త్రిధామాతా ॥

ప్రాతఃసంధ్య నక్షత్రములుండగా ప్రారంభించుట ఉత్తమము. నక్షత్రము కనబడక, సూర్యోదయము కాకపూర్వము చేయుట మధ్యమము. సూర్యోదయమైన పిదప చేయుట అధ

మము. అట్లే సాయంసంధ్యావందనము సూర్యుడుండగా (అర్థాస్త మయముస) ప్రారంభించుట ఉత్తమము. సూర్యాస్తమయమై నక్షత్రము లుదయించక పూర్వము చేయుట మధ్యమము. నక్షత్రోదయమైన పిదప చేయుట అధమము. సూర్యోదయాది షడ్ఘటికా పర్యంతము సంగవకాలము. అది దాటగానే మధ్యాహ్నిక సంధ్య నుపాసించు టుత్తమము. 15 ఘడియలలోపున చేయుట మధ్యమము, అపరాహ్ణమున చేయుట అధమము. సకాలమున చేసిన సంధ్యోపాసన స్వర్గమోక్షప్రదాయిని అగును, అకాలమునందు చేసినది నిష్ఫలమగును అని చెప్పబడినది (గౌతమ సంహిత)

అహా ! ఇట్టి మహిమాన్వితమును, దైవసాక్షాత్కారమును కలిగించు బ్రహ్మతేజోపాసనగూర్చి అధికముగా చెప్పనేల ? ఈ సంధ్యోపాసకులకీ యొక్క దానివలననే ముక్తికలుగుట కెట్టి లోపమునులేదు. ఇది సర్వరోగ నివారిణికూడా. ఆ ప్రత్యక్ష ఫలమునుకూడా పొందవచ్చును, ఇంకను అనంత ఫలముల పొంద వచ్చును. సంధ్యోపాసనను నిత్యము సకాలములందు ముమ్మారు తప్పకచేసి లాభక్షేమము లందుదని కోరుచున్నాను, ఇంక మీరేమియు చేయసక్కరలేదు.

ముత్తెములవలె వర్ణముగల మహేశ్వరుడును, పగడ వర్ణముగల గణనాథుడును, హేమమువలెనుండు నంబికయు, నీల వర్ణఛాయగల శ్రీమహావిష్ణువును, తెల్లనికాంతిగల సూర్యుడును పంచాయతన దేవతాపూజయను కర్మసిద్ధి సంధ్యావందనము వలన గలుగుచున్నది.

## యజ్ఞోపవీత ధారణ ప్రకరణము

(కేశవనామాలు ప్రాణాయామము సంకల్పముచేసి) శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన యోగ్యతాసిద్ధ్యర్థం నూతన యజ్ఞోపవీతధారణం కరిష్యే, (అని చెప్పవలయును.)

## యజ్ఞోపవీత ధారణ మంత్రము

యజ్ఞోపవీతం పరమంపవిత్రం। ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచశుభ్రం। యజ్ఞోపవీతం బలమస్తు తేజః॥ అని చెప్పి యజ్ఞోపవీతం వేసికొనవలయును.

## యజ్ఞోపవీత విసర్జన మంత్రము

పవిత్రవంతం యది జీర్ణవంతం వేదాంతనిత్యం పరబ్రహ్మ సత్యమ్। అయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం. (యజ్ఞోపవీతమును విసర్జన చేయవలయును.)

విసర్జించిన జందెమును పవిత్ర నదిలోనో, దేవస్థానములోనో. రావి మొదలగు పవిత్ర వృక్షములమీదికో విడువవలెను.

## ఉపవీతముయొక్క ఆవశ్యకత

ఉపవీతీభవేన్నిత్యం విధిరేషస్సనాతనః (వసిష్ఠస్మృతి) ఎల్లప్పుడు యజ్ఞోపవీతము ధరింపవలెను. ఇది సనాతధర్మము. ఆర్యులది యాదర్శమయమైన జీవనము. ఆదర్శరహితులు ఆహారపానీయములతో నిద్రాదికములతో జీవితమును వ్యర్థ

ముగా గడపి మరణింతురు. ఇట్టివారి జీవితము పశుతుల్యము భారతీయ ధర్మ మిట్టి జీవన మేవగించుకొనును. ప్రతివ్యక్తియు ఆదర్శమయమగు జీవనము గడపుటయే సనాతనధర్మ ప్రబోధ లక్ష్యము. ఆదర్శమయ జీవితమున ప్రవేశించుటకే యజ్ఞోప వీతము ధరింపజేయబడుచున్నది.

శ్లో॥ సూచనాద్బ్రహ్మతత్త్వస్య। వేదతత్త్వసంసూచనాత్
తత్సూత్రముపవీతత్త్వాత్। బ్రహ్మసూత్రమితిస్మృతమ్.

బ్రహ్మ తత్త్వమును వేద తత్త్వమును సూచించుటచే యజ్ఞోపవీతమునకు బ్రహ్మసూత్ర మనియు పేరు వచ్చినది. అనగా వేదాధ్యయనమునకు బ్రహ్మసాధనకు ప్రతిజ్ఞా చిహ్నమే జన్నిదము.

శ్లో॥ యజ్ఞాఖ్యః పరమాత్మాయ। ఉచ్యతేయ్యైశ్చహోతృభిః
ఉపవీతం యతోస్యేదం। తస్మాద్యజ్ఞోపవీతనం॥ 3

(పారిజాత స్మృతిసారము)

యజ్ఞరూపియైన పరమాత్మ కొరకు ప్రతిజ్ఞా సూత్రముగా ధరింపబడునదియే యజ్ఞోపవీతము.

యజ్ఞోపవీతము భగవత్ప్రాప్తికై జీవితార్పణమునకు ప్రతిజ్ఞాసూచకము. భగవత్ప్రాప్తికై తగిన శుభకర్మలు ధర్మములు ఆచరించుట యజ్ఞోపవీతధారికి అవశ్యము కర్తవ్యము. నీచ స్వార్థమునకు దూరముగానుండి మానవసేవయె మాధవ సేవగా భావించి విశ్వమానవ కళ్యాణమునకు పాటుపడుచు ఆత్మోద్ధరణమునకు కృషిచేయుటయే యజ్ఞోపవీతము ధరించు వారి పరమలక్ష్యము.

# యజ్ఞోపవీత ధారణమువలన లాభములు

ఉపవీతినే పుష్టానాంపతయేనమః (యజుర్వేదము) అనగా ఉపవీతధారియైన పుష్టిశాలురలో అగ్రేసరుడైన వానికి నమస్కారములు అని భావము. ఉపవీతధారులు పుష్టిగలవారు. నమస్కరింపదగువారు కాగలరని దీనివలన ద్యోతకమగుచున్నది.

ప్రాణానాం గ్రంథి రసిమావిత్రసో స్తక ఇదంతే పరిదదామ్యహాంక" యజ్ఞోపవీతమ ! ప్రాణులకు గ్రంథివి. నీవు దుఃఖము నశింపచేయుదానివై ఈ శరీరమున ప్రతిష్ఠింపబడితివి. నేను నిన్ను ధరించుచున్నాను.

పై భావమునే క్రింది నారాయణోపనిషత్తుకూడ సూచించుచున్నది. ప్రాణానాం గ్రంథిరసరుద్రోమావి శాన్తకః తేనావ్నే నాప్యాయస్వ పైన వ్రాసిన బ్రాహ్మణ భావమునే ఈ మంత్రము కూడ బోధించుచున్నది.

పై రెండు వచనములవలన యజ్ఞోపవీతము ప్రాణగ్రంథియనియు అనగా దీర్ఘాయు వొసంగునదనియు దుఃఖనాశకమనియు ద్యోతకమగును. యేనేంద్రాయ బృహస్పతిర్వ్యాసః పర్యదధా దమృతంతే నత్వాపరిదధామ్యాయుషే దీర్ఘాయుత్వాయ వర్చసే (పారిజాత గృహ్యసూత్రము) బృహస్పతి ఇంద్రునిచే యజ్ఞోపవీతము ధరించునట్లు నేనుకూడ ఆయువు బలము అభివృద్ధి పొందుటకై యజ్ఞోపవీతము ధరింతును.

పై వచనములవలన యజ్ఞోపవీతముయొక్క గొప్పదనము వెల్లడియగుచున్నది. దీర్ఘాయువు, స్వస్థత, తేజస్సు, బలము, వృద్ధి, ప్రతిష్ఠ యజ్ఞోపవీత ధారణమువలన లభించును. సంసారము నందలి సర్వసుఖములు యజ్ఞోపవీతమునందు నిహితమై యున్నవి.

మహాభారతమునందు యజ్ఞోపవీతీదేవానాం అను పదము వచ్చును. అందు యజ్ఞోపవీతధారులైన దేవతల వర్ణనము కలదు. దానివలన దేవత్వ చిహ్నములలో యజ్ఞోపవీత ధారణ యొకటి యని స్పష్టమగుచున్నది. యజ్ఞోపవీతమునకు దేవత్వమునకు ఘనిష్ఠ సంబంధము కలదు.

కేవలము భౌతికసంపదలనేకాక దేవత్వమునుగూడ ఒసంగు శక్తి జందెమున కున్నది. ఉపవీతధారి తనకు విధింపబడిన విధుల నాచరించిన దేవత్వము సిద్ధించును. దేవతలు స్వర్గమున పొందు సౌఖ్యములు జందెము దాల్చువారు పొందగలరు.

ACC NO 76446

ఇంత మహత్తరశక్తి దారపు పోగులతో నిర్మితమైన జందెమున కెట్లు కలిగినదో తెలిసికొందము. మానవుడు బాహ్యాభ్యంతరములందు పరిశుద్ధుడై ఇహపరసుఖములు పొందునట్లు చేయ గల విశేష మెట్లు వచ్చినది? ఈ ప్రశ్న మనకు వేద మిట్లు సమాధాన మిచ్చుచున్నది.

294.531 SRI

శ్లో॥ దేవా ఏతస్యామవదన్తపూర్వే। సప్తఋషయస్తపసేయే నిషేదుః

6200

భీమాజాయా బ్రాహ్మణస్యోపనీతా దుర్ధాదధాతి పరమే వ్యోమన్. 8

సప్తర్షులు దేవతలు జన్నిదమునందు గొప్ప శక్తి కలదు. ఆ శక్తి మగుల పరిశుద్ధ చరిత్ర నొసంగునది. కర్మ పరాయణులుగా తీర్చిదిద్దగలది. దీనిని దాల్చువారు పరమపదంబు నొందుదురు అని పలికిరి.

జందెము దాల్చువారు తాము బ్రహ్మసూత్రము దాల్చితిమని భావింతురేకాని దారములు ధరించితిమని తలంపరు. తనకు జన్మతః సిద్ధించిన ఋషిఋణము, పితృఋణము. మాతృఋణము అను మూడు ఋణములు తీర్చుకొనుటకు యోగము యజ్ఞము తపస్సు సాధించుటకై యజ్ఞోపవీతధారి జీవితము గడపవలెను. జీవితము బ్రహ్మపరాయణము, ఆధ్యాత్మికము అగునట్లు మలచుకొనవలెను.

మనోవాక్కర్మములయందు ధర్మనిష్ఠగలవారే నిజమైన బ్రాహ్మణులు. అట్టి బ్రాహ్మణులకు గొప్ప మహిమ గలదు. ఆ మహత్తరశక్తి జందెమువలననే సిద్ధించుచున్నది.

శ్లో॥ యజ్ఞోపవీత సంస్కారం । వినాయేహిద్విజాతయః
పాదోదకం సురాతుల్యం । కర్పటం తులసీదళం ॥
కాకవిష్ఠానమంతస్య । పిండదానం పితుర్మఖే
గోమాంసం భోజనం తస్య । జలం । శూకర రక్తవత్॥ 10
(నారద సంహిత)

యజ్ఞోపవీత సంస్కారములేని బ్రాహ్మణున కిచ్చిన పాదోదకము మద్యముతో సమానము. తులసీదళము ముఱికిగుడ్డవంటిది. అట్టి విప్రు డిచ్చిన పిండదానము కాకిరెట్టతో సమానము. వాని యింటి భోజనము గోమాంసతుల్యము. వాడిచ్చిన జలము పంది రక్తమువంటిది.

శ్లో॥ త్రిరస్యాప మాస న్తిసత్యాస్వార్హా దేవస్య
జనిమాన్యగ్నేః ॥
అనంతే అంతః పరివీతఆగా చ్ఛుచిః శుక్రోఅర్హో
రోరుచానః ॥
(ఋగ్వేదము)

జందెమున మూడు పేటలు కలవు. వానివలన సత్యము, తేజస్సు, పవిత్రత వెల్లడియగును. మధ్యనున్న ముడి (బ్రహ్మ గ్రంథి) అనంత పరమాత్మను తెల్పును.

శ్లో॥ యజ్ఞోపవీతం కుర్వీత । సూత్రేణనవతా న్తకం
దేవా న్తత్ర ప్రవక్ష్యామి । అనుపూర్వేణయాః స్మృతాః
ఓంకారః ప్రథమేతంతౌ । ద్వితీయేగ్ని స్తథైవచ
తృతీయేనాగ దైవత్యం । చతుర్థే సోమదేవతా
పంచమే పితృదైవత్యం । షష్ఠైచైవ ప్రజాపతిః 13
స ప్తమే మారుతశ్చైవ । అష్టమే సూర్యఏవచ
సర్వేదేవా స్తునవమ । ఇత్యేతా స్తన్తు దేవతా ॥ 14
(సామవేదీయ ఛాందోగ్యసూత్రము)

యజ్ఞోపవీతమునందలి తొమ్మిది పోగులలోను 9 మంది దేవతలు నివసించునట్లు చెప్పబడిరి. 1 వ పోగున ఓంకారము (బ్రహ్మ) 2 వ పోగున అగ్ని (తేజము) 3 వ పోగున అనంతుడు (ధైర్యము) 4 వ పోగున చంద్రుడు (చల్లనికాంతి) 5వ పోగున పితృదేవతలు (స్నేహము) 6 వ పోగున ప్రజాపతి (ప్రజాపరిపాలన) 7వ పోగున వాయువు (స్వచ్ఛత) 8వ పోగున సూర్యుడు (ప్రతాపము) 9 వ పోగున సర్వదేవతలు (సమదృష్టి) నివసించుచుండును.

తొమ్మిదిమంది దేవతలను, తొమ్మిది గణములను ధరించుటయే నవతంతు నిర్మితమైన జందెము ముఖ్యాశయము. బ్రహ్మ పరాయణత్వము, తేజస్సంపన్నత, ధైర్యము, నమ్రత, దయ, పరోపకారము, స్వచ్ఛత, శక్తి, సమదృష్టి యనునవి పైన పేర్కొన్న తొమ్మిదిమంది దేవతల గుణములు. నవతంతు నిర్మితమైన జందెము దాల్చినవారా తొమ్మిది గుణములు పొందుటకై నిరంతరము సాధన చేయవలసియుండును.

శ్లో॥ ధృతిః క్షమాదయా స్తేయం। శౌచమింద్రియనిగ్రహః
ధీర్విద్యా సత్యమ క్రోధో। దశకం ధర్మలక్షణం॥ 15

అను శ్లోకమున చెప్పబడిన 10 లో దమము ఇంద్రియ నిగ్రహము అనునవి ఇంచుమించు ఒకటే (స్వల్పభేదము మాత్రమే కలదు.) అందుచేతనే కొందరు శాస్త్రకారులు వీనిని 9 యనియే పేర్కొనిరి 1) ధైర్యము 2) ఓర్పు 3) దయ 4) ఆస్తేయము (దొంగిలింపకుండుట) 5) శౌచము 6) ఇంద్రియ నిగ్రహము 7) బుద్ధి 8) విద్య 9) సత్యము అను 9 యు నవతంతు యజ్ఞోపవీతము దాల్చు వారు అలవరచుకొని యితరులకు ఆదర్శప్రాయులు కావలెను.

శ్లో॥ బ్రహ్మణోత్పాదితం సూత్రం। విష్ణునా త్రిగుణీకృతం
కృతోగ్రన్థిస్త్రినేత్రేణ। గాయత్ర్యాచాభిమంత్రితం 16
(సామవేదీయ ఛాందోగ్యసూత్రములు)

బ్రహ్మ 3 వేదములనుండి మూడు సూత్రములుగైకొని యొక సూత్రముగా చేసెను. విష్ణువు కర్మకాండ

ఉపాసనాకాండ జ్ఞానకాండలచే 3 రెట్లు చేసెను. శివుడు గాయత్రిచే నభిమంత్రించి బ్రహ్మ గ్రంధిచేసెను. ఈ ప్రకారము ఋగ్యజు స్సామవేదముల జ్ఞానకర్మోపాసనలు సృష్టి స్థితి లయములు యజ్ఞోపవీతమున గోచరించుచున్నావి. త్రిమూర్తుల త్రివిధ కర్మముల వలస నవతంతు యజ్ఞోపవీతము నిర్మింపబడెను.

శ్లో॥ చతుర్వేదీషుగాయత్రీ। చతుర్వింశతి కాక్షరీ
తస్మాచ్చతుర్గుణంకృత్వా। బ్రహ్మతన్తు ముదీరయేత్ 71

గాయత్రీ మంత్రమున 24 అక్షరములు కలవు. వేదములు 4 వేదసంఖ్యచే గాయత్రీ మంత్రాక్షర సంఖ్యను గుణింపగా $24 \times 4 = 96$ అగును. అదియే 96 బెత్తలలోని రహస్యము.

శ్లో॥ తిథి ర్వారంచ నక్షత్రం। తత్త్వవేద గుణాన్వితం
కాలత్రయం చ మాసాశ్చ। బ్రహ్మసూత్రం హిషడ్వీధం
(సామవేదీయ ఛాందోగ్య సూత్రము॥)

తిధులు 15, వారములు 7, నక్షత్రములు 27, తత్త్వ ములు 25, వేదములు 4, గుణములు 3, కాలములు 3, మాస ములు 12 కలిపిన 96 అగును. పరమపురుషుని శరీరమున సూత్రా త్మకమైన ప్రాణముయొక్క 96 వస్తువుల రూపము మెడనుండి కటివరకు వ్రేలాడుచుండునది యజ్ఞోపవీతము. అట్టి భావము యజ్ఞోపవీతము దాల్చువారి మనస్సులకు కలుగవలెను.

4 వేదములలోను 1 లక్ష శ్రుతులున్నవి. వానిలో 80 వేలు కర్మకాండను, 16 వేలు ఉపాసనాకాండను మిగిలిన

4 వేలు జ్ఞానకాండను బోధించును. వీనిలో కర్మకాండ ఉపాసనా కాండలు బ్రహ్మచారులకు, గృహస్థుల కనుద్దేశింపబడగా జ్ఞాన కాండ సన్యాసుల కుద్దేశింపబడినది. కర్మకాండలో 80 వేల శ్రుతులు. ఉపాసనకాండలోని 16 వేల శ్రుతులు కలిపిన 96 వేలు అగును.

ఒక్కొక్క బెత్త వెయ్యి శ్రుతులకు ప్రాతినిధ్యము వహించును. 96 బెత్తలు 96 వేల శ్రుతులకు ప్రాతినిధ్యము వహించును. 96 బెత్తలతో జందెము నిర్మింపబడుటకు కారణము 96 వేల శ్రుతులను ప్రతిద్విజుడు ధరింపవలెననియే.

సాముద్రిక శాస్త్రము ఎవరి శరీరమువారి యంగుళులతో కొలిచిన 84 నుండి 108 అంగుళములుండును. అని చెప్పుచున్నది.

సగటున మానవుని కొలత 96 అంగుళములగా భావించి జందెమున 96 బెత్తలు నిర్ణయించిరనియు చెప్పుచున్నది. దేహమును జీవితమును బ్రహ్మమయముగా చేసికొనుట చిహ్నముగా 96 బెత్తలు యజ్ఞోపవీతమున నిర్ణయించిరి.

మానవుని యాయుర్దాయము 101 సంవత్సరములు. పంచమ వర్షమున ఉపనయనముచేసి జందెము ధరింపజేసినప్పటినుండి మిగిలిన 96 సంవత్సరములు (కనీసము) విధి నిర్వహణ మొనర్చుచు లోక సంగ్రహము చేయవలెనని సూచించుటకూడ జందెమునందలి 96 బెత్తలని చెప్పుదురు.

శ్లో॥ మూత్రేతు దక్షిణేకర్ణే । పురీషే వామకర్ణకే ।
ఉపవీతం సదాధార్యం । మైధునేతూపవీతవత్ ॥
(అహ్నికాకారిక)

మూత్రవిసర్జన సమయమున కుడిచెవికి, మలవిసర్జన సమయమున ఎడమచెవికి జందెము చుట్టుకొనవలెను. మైధున సమయమున యథాప్రకారము జందెము నుంచుకొనవలెను.

మలమూత్రములు విసర్జించు సమయమున అపవిత్ర వాయువునకు, అపవిత్ర జలమునకు, అపవిత్ర పదార్థమునకు, అపవిత్రావయవములకు, జందెము తాకగలదను శంకతో (జందెము పవిత్రతను సదా రక్షింపవలెనను ఆశయముతో) మలమూత్రములు విసర్జించు సమయమున జందెమును చెవికిచేర్చు పద్ధతి యేర్పడినది. చెవికి వ్రేలాడదీసిన జందెముపైకి, నడుముపైకి చేరనుకాన అపవిత్రమగుట కవకాశముండదుకదా !

కర్ణమూలమునందలి నాడులకు మూత్రాశయమలాశయములకు సంబంధము కలదని శరీరశాస్త్రము చెప్పుచున్నది. కుడిచెవి నాడులకు మూత్రాశయముతోను, ఎడమచెవి నాడులకు గుదముతోను సంబంధము కలదు. మూత్రము విడుచునప్పుడు జందెమును ఎడమచెవికి చుట్టుటచే చెవి నాడులపై వత్తిడి కలిగి మూత్రాశయ నాడులకు గూడా యొత్తిడి కలిగి మూత్రము జారీగా వెలువడును. దాని ఫలితముగ మధుమేహాము మొదలగు మూత్రాశయ సంబంధమగు వ్యాధులు నివారింపబడును. మలవిసర్జన సమయమున జందెమును కుడిచెవికి చుట్టిన చెవినాడులకు, మలాశయనాడులకు వత్తిడి కలిగి జాడించి విరోచన మగుటయేకాక మూలశంక మొదలగు గుదసంబంధమైన వ్యాధులు రాకుండా జేయును.

శ్లో॥ క్షుత్తే నిష్ఠీవనే చైవ । దంతోచ్ఛిష్టే తథానృతే
పతితానాం చ సంభాషే । దక్షిణం శ్రవణం స్పృశేత్ ॥ 20
(పరాశరస్మృతి)

తుమ్మినప్పుడు, ఉమ్మివేసినప్పుడు, ఎంగిలి యే యవయవమునకైన కలిగినప్పుడు కుడిచెవిని స్పృశింపవలెను.

స్వల్పమైన అపవిత్ర కార్యములు మాలిన్యములు చెవిని తాకుటచే తొలగిపోవును. చెవిని తాకుట; లేక చెవి పట్టుకొనుట, చెవిని నొక్కిపెట్టుట, అనునవి చిన్న పొరపాట్లకు చిన్న ప్రాయశ్చిత్తములుగా పరిగణింపబడెను. ఉపాధ్యాయుడు విద్యార్థి చెవి పట్టుకొనుట వలన, మెల్లగా మెలిపెట్టుట వలన విద్యార్థిలో దేవత్వము, మనోబలము వికసించు నవకాశమున్నది. చెవిపై జందెమును చేర్చుటచే గలుగు ప్రయోజనము కూడ అటువంటిదే. ఈ యుద్దేశముతోగూడ మలమూత్ర విసర్జన సమయమున జందెమును చెవికి చేర్చవలెననిరి.

శ్లో॥ ఆదిత్యా వసవోరుద్రా । వాయురగ్నిశ్చ ధర్మరాట్
విప్రస్యదక్షిణేకర్ణే । నిత్యం తిష్ఠంతి దేవతాః ॥ 21
(సాంఖ్యాయుడు)

శ్లో॥ అగ్ని రాపశ్చ వేదాశ్చ । సోమస్సూర్యో నిలస్తథా
సర్వేదేవాస్తు విప్రస్య । కర్ణేతిష్ఠంతి దక్షిణే॥
(ఆచార మయూఖము)

శ్లో॥ ప్రభాసాదీనితీర్థాని । గంగాద్యాస్సరితస్తథా
విప్రస్యదక్షిణేకర్ణే । వసన్తి మునిరబ్రవీత్ ॥ 23
(పరాశరుడు)

పై మూడు శ్లోకములు కుడిచెవి పవిత్రతను వివరించు చున్నవి. సాంఖ్యాయనుని మతము ననుసరించి విప్రుని కుడిచెవి యందు ఆదిత్యులు వసువులు రుద్రులు వాయువు అగ్ని నివసింపగా ఆచారనుయూఖకారుని మతమున అగ్ని జలము వేదము సోముడు సూర్యుడు వాయువు సర్వదేవతలు నివసింతురు. పరాశరుడు ప్రభాసాది తీర్థములు గంగాది నదులు విప్రుని దక్షిణ కర్ణమున కలవని వచించెను.

శ్లో॥ సూతకే మృతకేక్షౌరే । చండాలస్పర్శనేతథా
యజ్ఞసూత్ర నవీనస్య । ధారణం ప్రవిధీయతే ॥ 24
రజస్వలా శవస్పర్శే । మ్లేచ్ఛాదీనాం తథైవచ ॥ 25
(నారాయణ సంగ్రహం)

శ్లో॥ మలమూత్రం త్యజేద్విప్రో । విస్మృత్యైవోపవీతధృక్
ఉపవీతం తదుత్సృజ్య । ధార్యమన్యం నవంతదా ॥ 26
(నారాయణీయము)

శ్లో॥ జీర్ణయజ్ఞోపవీతాని । శిరోమార్గణ సంత్యజేత్ ॥ 27

పురుడు, మైల, శవస్పర్శ, రజస్వలాస్పర్శ మొదలగునవి జరిగినప్పుడు, మలమూత్రవిసర్జన చేయునప్పుడు జందెమును చెవికి చేర్చుట మరచినను క్షౌరము చేయించుకొన్నను క్రొత్తజందెము దాల్చవలెను. జీర్ణయజ్ఞోపవీతము శిరమునుండియే తీసివేయవలెను.

శ్లో॥ బ్రహ్మచారిణా ఏకంస్యాత్ స్నాతస్యద్వే బహూనితా ॥సూ॥ 28

బ్రహ్మచారియొక్క జందెము స్నాతకుడు రెండు జందెములు దాల్పవలెను, వివాహమైన వ్యక్తి రెండు జందెములు దాల్చుటలోని యాశయము భార్య యజ్ఞోపవీతము, తత్సంబంధమైన విధినిర్వహణ భారము పురుషుడు ధరింపవలసివచ్చు

టయే ఋతుధర్మము. పిల్లల మలమూత్రములు తీయవలసి వచ్చుట, అపవిత్ర వస్తువులను శుభ్రము చేయవలసివచ్చుట అను కారణములచే స్త్రీలకు జందెము నిషేధింపబడెను. ఈ కారణము చేతనే అర్థాంగి ధర్మనిర్వహణభారము తన భుజములపై వేసికొన్న దానికి చిహ్నముగానే పతి రెండు జందెములు దాల్చును.

శ్లో॥ యజ్ఞోపవీతే దేధార్యే । శ్రౌతేస్మార్తేవ కర్మణి
తృతీయ ముత్తరాయార్థం । వస్త్రాభావేతదిష్యతే ॥ 29
(హేమాద్రి)

శ్రౌతస్మార్తకర్మల నిర్వహణ నిమిత్తము రెండు జందెములు ఉత్తరీయముకొరకు మూడవ జందెము దాల్పవలెను. వస్త్రాభావే చతుర్థంస్యాత్ పంచమం కామ్యం అను గౌతమ సంహిత ననుసరించి 4 జందెములు 5 జందెములుకూడ ధరింతురు.

శ్లో॥ పృష్ఠవంశేచనాభ్యాశ్చ । ధృతంయద్విన్దతేకటిం
తద్ధార్యముపవీతంస్యా । న్నాతిలంబనం నోచ్ఛ్రితం ॥ 30
(కాత్యాయన స్మృతి)

మెడనుండి వీపును నాభిని తాకుచు కటిభాగము వరకు వ్రేలాడు జందెము ధరింపవలెను, ఇందుకు తక్కువగాగాని అధికముగాగాని యుండరాదు.

శ్లో॥ ఆయుర్హరత్య తిహ్రస్వం । అతిదీర్ఘం తపోహరం ॥ 31
(స్మృతి ప్రకాశము)

మిదుల హ్రస్వముగానున్న జందెము అయువు హరించును. అధికముగా నున్నది తపస్సు హరించును.

పారాశర సంహితాభాష్యకారులగు మాధవాచార్యులవారు తమ టీకలో ఇట్లు రచించిరి.

శ్లో॥ ద్వివిధాస్త్రియో బ్రహ్మవాదిన్యః సద్యోవధశ్చ । తత్రబ్రహ్మ
వాదినీనాం

ఉపనయనం. అగ్నిబన్ధన వేదాధ్యయనం
స్వగృహే భిక్షావృత్తిశ్చ, వధూనాం తూపస్థితే
వివాహేకథంచిదుపనయనంకృత్వా వివాహః కార్యః ॥ 82

బ్రహ్మవాదినులని, నవవధువులని స్త్రీలు రెండు రకములు. బ్రహ్మవాదినులు ఉపనయనము చేసుకొని వేదాధ్యయనము చేయు గృహమునందే భిక్షావృత్తి నవలంబింపవలెను. నవవధువులు పెండ్లి సమయమున ఉపనయనముచేసి యజ్ఞోపవీతధారణ చేయవలెను.

శ్లో॥ పురాకల్పేతు నారీణాం । మౌంజిబంధనమిష్యతే
అధ్యాపనం చ వేదాన్తం । సావిత్రీ పవచనం తథా ॥ 93
(యమ సంహిత)

పురాతన కాలమున స్త్రీలకు ఉపనయనము, వేదపఠనము, సావిత్రీజపము విధింపబడినవి.

యజుర్వేదీయ పారస్కర గృహ్య సూత్రములో స్త్రీయ ఉపవీతాశ్చ మొదలగు వచనములవలన ప్రాచీన కాలములో స్త్రీలలో ఉపనయనము చేయబడువారు. ఉపనయనము చేయబడని వారు అని రెండు తెగలుండెడివారని తెలియుచున్నది.

శ్లో॥ శూద్రాణా మదుష్టకర్మణాముపనయనం । ఇదంచరథ
కారస్యోపనయనం ఆదుష్టశర్మణాంశూద్రాణా ముపనయనం ॥

సత్కర్మ నిరతులగు శూద్రులకు రథకారులకు ఉపనయనము విధింపబడినది.

ద్విజత్వ చిహ్నములు కలిగి యజ్ఞోపవీతమునందు నిక్షిప్తమైన రహస్యము లెఱింగి తమ జీవితము నున్నత పథములలో

నడుపుకొనుటకు ఇచ్ఛగలవారు యజ్ఞోపవీతము ధరించు నర్హత గలవారనియు గుణకర్మలచే శూద్రలక్షణములు కలవారు యజ్ఞోపవీతము దాల్పరాదనియు మహర్షుల యాశయముగా తోచుచున్నది.

## యజ్ఞోపవీతమునకు గాయత్రీ మంత్రమునకు సంబంధము

ఉపనయన సమయమున యజ్ఞోపవీతము ధరించి చేయు వేదాధ్యయనమునకు గాయత్రీ మంత్రముతోనే ప్రారంభోత్సవము చేయబడును. గాయత్రీ యజ్ఞోపవీతముల మేలుకలయికచేసిద్ధించు నదియే ద్విజత్వము. ఉపవీతము సూత్ర (దారము)కాగా, గాయత్రి వ్యాఖ్యరూపమైనది. ఉపవీతమున మూడు పోగులున్నవి. గాయత్రి యందు 3 చరణములున్నవి. తత్స వితుర్వరేణ్యం 1 వ చరణము. భర్గో దేవస్యధీమహి 2 వ చరణము. ధియోయోనః ప్రచోదయాత్ 3 వ చరణము. ఉపవీతమున మూడు ప్రథమ గ్రంథులు, ఒక బ్రహ్మగ్రంధి కలవు. గాయత్రిలో భూః భువః సువః అని మూడు వ్యాహృతులు ఒక ప్రణవము కలవు.

(మరికొన్ని విశేషములు అనుబంధమున వివరింపబడెను.)

## యజ్ఞోపవీత పూజామంత్రము

శ్లో॥ ప్రజాపతేర్యత్సహజం పవిత్రం కర్పాససూత్రోద్భవ
బ్రహ్మసూత్రం । బ్రహ్మత్వసిద్ధ్యైచయశః ప్రకాశం
వ్రతస్యసిద్ధిం కురు బ్రహ్మసూత్ర ॥

భావము :- హే బ్రహ్మసూత్ర ! నీవు ప్రజాపతిద్వారా సహజముగా పవిత్రమైన ప్రవృత్తిదారముతో నిర్మింపబడితివి. నీవు బ్రహ్మసూత్రముయొక్క సిద్ధిని, కీర్తిని, తేజస్సును, వ్రత సాఫల్యమును ప్రసాదింపుము.

## యజ్ఞోపవీతధారణ మంత్రము

శ్లో॥ యజ్ఞోపవీత మసియజ్ఞస్యత్వా యజ్ఞోపవీతేనోపనహ్యామి
(పారస్కరుడు)

యజ్ఞముయొక్క ఉపవీతి (ప్రతిజ్ఞ లేక పవిత్రత) స్వరూపమైన యజ్ఞోపవీతము ధరించుచున్నాను.

శ్లో॥ యజ్ఞోపవీతస్యోత్పత్తిం । యోనజానాతి వై ద్విజః
సమూఢో భారవాహేచ । వృషభో నాస్తికో యధా
విఫలం సహతేభారం । యో నజానాతి లక్షణం
కర్మబాహ్యోద్విజో నూనం । అపూజ్యోలోకనిందితః ॥

యజ్ఞోపవీతోత్పత్తిని లక్షణమును ఎరుంగని ద్విజుడు బరువుమోయు నెద్దువలె మెడపై జంధెమును వ్యర్థముగా మోయుచున్నాడు. అట్టి మూర్ఖుడు నాస్తికుడు. ద్విజకర్మలచే బహిష్కృతుడై లోకనింద్యుడగును. యజ్ఞోపవీతమునందు నిహితమైనభావము ఆశయము రహస్యము నెరుంగక పరంపరాగతాచారము ననుసరించి జంధెము ధరించినంతమాత్రమున కలుగు పరమ ప్రయోజనము ఏమియులేదు. ఇందలి రహస్య మెరుంగక జంధెము వేసికొనువాని ద్విజత్వము మిథ్య మాత్రమే.

# గాయత్రీ గీత

ఓమ్. శ్లో॥ ఓమిత్యేవసునామ. ధ్యేయమనఘం విశ్వాత్మనో బ్రహ్మణః

సర్వేష్వే వహితస్య నామసువసో శేత త్ప్రిధానంమతం
యం వే దాని గదంతీ న్యాయనిరతం శ్రీసచ్చిదానందకం
లోకేశం సమదర్శినం నియమినం చాకారహీనంప్రభుం॥ 1

భా॥ న్యాయకారియనియు. సచ్చిదానందమనియు, సర్వేశ్వరుడనియు, సమదర్శియనియు, ప్రభువనియు, నిరాకారమనియు వేదములచే వర్ణింపబడుచు ఆత్మరూపముతో విశ్వమంతట వ్యాపించి పరబ్రహ్మయొక్క నామములతో శ్రేష్ఠతమమై పాపరహితమై పవిత్రమై ధ్యానయోగ్యమై యొప్పునది యోంకారము.

శ్లో॥ భూర్వైప్రాణ ఇతిబ్రువన్తిమునయోవేదాంతపారంగతాః
ప్రాణః సర్వవిచేతనేషు ప్రసృతః సామాన్యరూపేణ చ
ఏతే నైవవిసిద్ధ్యతేహి సకలం నూనం సమానం జగత్
ద్రష్టవ్యంసకలేషు జంతుషుజనైర్నిత్యంవ్యాతశ్చాత్మవత్॥

భా॥ ప్రాణమునే భూః అని మునులు వచింతురు. ప్రాణమన్ని ప్రాణులలో సమానముగా వ్యాపించియున్నది. దీనివలన మానవులనేగాక అన్ని ప్రాణులను సమానముగా చూడవలెనని స్పష్టమగుచున్నది.

భువ:- శ్లో॥ భువర్నాశోలోకే సకల విపదాం వై నిగదితః
కృతం కార్యం కర్తవ్యమితి మనసాచాస్య కరణం
ఫలాహమర్త్యాయవిదధతినవై కర్మనిరతాః
లభన్తేనిత్యం తేజగతిహి ప్రసాదంసుమనసాం ॥ 3

భా॥ సర్వదుఃఖ వినాశనమును భువః వెల్లడించుచున్నది. కర్తవ్య నిర్వహణ బుద్ధితోచేయు పనికే కర్మయని పేరు. ఫలాభిసంధితో కర్మను నిర్వర్తింపనివారు సదా ఆనందముగా నుందురు.

స్వః- శ్లో॥ సర్వేషో వై శబ్దో నిగదతి మనఃస్థైర్యకరణం
తథాసౌఖ్యం స్వాస్థ్యం హ్యుపదిశతి చిత్రస్య చలతః ।
నిమగ్నత్వం సత్యవ్రత సరసిఛాపక్షత ఉత
త్రిధా శాంతిం హ్యేభిర్భువి చలభతే సంయమ రతః

భా॥ స్వః అను శబ్దము మనస్థైర్యము సూచించును. చంచలమైన మనస్సును సుస్థిరముగాను స్వస్థముగాను ఉంచుకొనుమనియు, సత్యము నాశ్రయింపుమనియు ఉపదేశించును. ఉపదేశమును ఆచరణలో పెట్టుటవలన ఆత్మిక, బౌధిక, శారీరక శాంతులు లభించును.

తత్ - శ్లో॥ తతోవై నిష్పత్తిః సభువి మతిమాన్ పండితవరః
విజానన్ గుహ్యం జీవస్మరణయోర్యస్తు నిఖిలం
అనన్తే సంసారే విచరతి భయాసక్తి రహితః
తథానిర్మాణంవై నిజగతివిధీనాం ప్రకురుతే ॥

భా॥ తత్ అను పదము జీవస్మరణ రహస్య మెరింగినవాడే బుద్ధిమంతుడని తెల్పుచున్నది. అట్టి బుద్ధిమంతుడే భయవిరహితుడై తన ముక్తిమార్గము సుగమముగా చేసికొనగలడు.

సవితుః- శ్లో॥ సవితుస్తుపదం వితనోతిధ్రువం
మనుజో బలవాన్ సవితేవ భవేత్
విషయా అనుభూతి పరిస్థిదాతయశ్చ
సదాత్మనఏవం గణేదతిసః ॥

భా॥ సవితుః అను పదము మనుష్యుడు సూర్యునివలె తేజోబలముతో గూడియుండవలెనని బోధించుచున్నది. విషయానుభూతులన్నియు తనవలననే కలుగుచున్నవని చెప్పుచున్నది.

వరేణ్యం - శ్లో॥ వరేణ్యం చైతద్వైప్రకటయతిశ్రేష్ఠత్వమనిశం
సదాపశ్యేచ్ఛ్రేష్ఠం మననపి శ్రేష్ఠస్య విదధేత్
తథాలోకేశ్రేష్ఠం సరలమనసాకర్మచభజేత్
తదేత్థ శ్రేష్ఠత్వం వ్రజతిమనుజః శోభితగుణైః॥

భా॥ ప్రతి మానవుడు నిరంతరము సన్మార్గమున పురోగమింపవలెనని ప్రబోధము చేయుచున్నది. ఉత్తమ దర్శనము ఉత్తమ విషయములు చింతించుట. ఉత్తమకార్యము లాచరించుట పరమ లక్ష్యములుగా నుండవలెనని వరేణ్యపద ప్రబోధము.

భర్గః - శ్లో॥ భర్గో వేతిపదంచవ్యా హరతిపై లోకస్సులోకో భవేత్
పాపే పాపవినాశనేత్యభిరతో దత్తావధానోవసేత్
దృష్ట్వాదుష్కృతిదుర్విపాక నిచయతేభ్యోజుగుప్సేద్ధిచ
తన్నాశాయ విధీయతాంచ సతతం సంఘర్ష మేభిస్సహా॥

భా॥ మానవులు పాపరహితులై యుండవలెననియు, పాపాత్ముల విషయమై జాగరూకతతో నుండవలెననియు, పాప ఫలితములను చూచి జ్ఞానమును తెచ్చుకొనవలెననియు భర్గ శబ్దము వెల్లడించుచున్నది.

దేవస్య - శ్లో॥ దేవస్యేతితువ్యాక రోత్సమరతాం మర్త్యోపి సంప్రాప్యతే
దేవానామివ శుద్ధదృష్టి కణారత్ సేవోపచారాద్భువః
నిఃస్వార్థం పరమార్థ కరణాత్ దీనాయదానాత్తథా
బాహ్యాభ్యంతర మస్యదేవభువనంసంసృజ్యతేచైవహి ॥

భా॥ మరణముగల మానవుడు అమరుడు కాగలడని దేవ శబ్దము జెప్పుచున్నది, పరిశుద్ధదృష్టితో, ప్రాణులకు సేవచేయుటచే పరమార్థకర్మల నాచరించుటతో బలహీనులకు సహాయ మొనరించు టచే మానవుని కెల్లడ స్వర్గ సౌఖ్యములు లభించును.

ధీమహిః ॥ ధీమహి సర్వవిధం హృదయేశుని
శక్తిచయ వయమిత్యుపదిష్ట్వా
నోమనుజోలభతే ముఖశాంతి
మనేనని నేతి వదంతిహి వేదాః

భా॥ ప్రజలందరు సర్వవిధములగు పవిత్రశక్తులు తమ హృదయములందు కలిగియుండవలెను. అట్టి పవిత్రత లేనివారు మనశ్శాంతి పొందజాలరని వేదములు చెప్పుచున్నవి. ధియః॥ ధియోవోన్మధ్యాచ్చాగమగనిమ మంత్రాన్ సుమతిమాన్.

విజానీయా త త్త్వం విమలనవనీతం పరమివ
యతోస్మిన్లోకేవై సంశయగతీ విచారస్థలసతే
మతిఃశ్రేద్ధవాచ్చా ప్రకటయతి సత్యంసుమనసే ॥

భా॥ తమ బుద్ధిచే వేదశాస్త్రములను మధించి బుద్ధిమంతులు తత్త్వామృతము గ్రహింపవలెను, పరిశుద్ధ బుద్ధిచేతనే సత్యము నెరుంగగలుగును.

యోనః యోనోవా స్తితుశక్తిసాధనచయోన్యూనాధిశశ్చాథవా
భాగ॥ నూనమనాతస్యవిదధేమాత్మ ప్రసాదాయవై
తత్పశ్చాదవశిష్ట భాగమఖిలం త్యక్త్వాఫలాశాం హృది
తద్దినేష్వఖిలాష వస్తువితరే మాంగీషు నిత్యవ్యయం ॥

భా॥ మనకున్న శక్తులు సాధనములు మనకొఱకు కత్యల్ప ముగా వినియోగించుకొని మిగిలిన శక్తులు సాధనములు దుర్భలుల నిమిత్త మధికముగా వినియోగింపవలెను.

ప్రచోదయాత్ ॥ ప్రచోదయాత్ స్వంత్వితరాంశ్చమానవాన్
నరః ప్రయాణాయచ సత్యవర్త్మని
కృతంహికర్మాఖిల మిత్థమంగినా
విపశ్చితోద్ధర్మ ఇతిప్రచక్షతే ॥

భా॥ మానవుడు తాను సత్యమార్గము ననుసరించుటయేగాక ఇతరులుకూడా అనుసరించునట్లు ప్రేరేపింపవలెను. అట్లు చేయు టయే ధర్మమని విద్వాంసులు వక్కాణింతురు.

— ० —

# శ్రీ వేదమాత ప్రార్థన

ఓ పూజ్య గాయత్రీ! క్షమాపరిపూర్ణా! ప్రేమమయీ!
నీకు నమస్కృతులు! సాష్టాంగప్రణామములు!
నీవు సచ్చిదానంద స్వరూపిణివి, సర్వాంతర్యామినివి,
సర్వశక్తిమయివి, సర్వజ్ఞురాలవు,
సర్వజీవి హృదయాంతర్వాసివి,
కరుణార్ద్రహృదయము. సమదృష్టి, స్థిరమనస్సు,
భక్తి విశ్వాస, జ్ఞానములు మాకు ప్రసాదింపుము,
ఆకర్షణ లణగద్రొక్కి చిత్తవృత్తుల నరికట్టుటకు,
మాకు వలయు అంతరాధ్యాత్మిక శక్తి నొసంగుము,
మా హృదయ ఫలకములను సద్గుణములతో నింపివేయుము,
కామ, క్రోధ, లోభ, ద్వేషముల బారినుండి మమ్ము తప్పింపుము,
ఈ సర్వనామ రూపములలో నిన్ను సేవింపనిమ్ము,
ఈ సర్వనామ రూపములలో నిన్ను తిలకింపనిమ్ము,
నిన్ను సదా స్మరించుకొననిమ్ము,
నీ లీలలు సదా గానము చేయనిమ్ము,
నీ నామము సదా మా పెదిమలపై నుండనిమ్ము,
నీలో మమ్ము సదా వసింపనిమ్ము, నీకన్న మాకు వేరేదిక్కు కలదా
అభీష్టములిచ్చి రక్షించుము, రక్షించుము, రక్షించుము,
సర్వజగదుపకారముగా నూరేండ్లు మమ్ము బెంచుము.
ధర్మమునుండి మమ్ము జారిపోనీకుము,
నిన్ను దెలిసి వర్ణింపనేరను.

ఓం తత్సత్.

---

లలితాంబికా ప్రింటర్స్, ఇన్నీసుపేట, రాజమండ్రి. ఫోన్ : 71079